శ్రీ రామ

# నీతిదీపావళి

[చిన్నకథలు]

(ప్రథమ ఖండము)



ప్రకాశకులు

రెడ్డి సోదరులు

రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.

బ్రాంచి:—రాజమండ్రి

శ్రీ రామ

# నీతిదీపావళి

ప్రథమ ఖండము

గ్రంథకర్త

## భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు



ప్రకాశకులు

రెడ్డిసోదరులు

రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.

బ్రాంచి:—రాజమండ్రి

శ్రీ మేరీముద్రాక్షరశాలయందు ముద్రితము

1932

 [వెల 2 అణాలు

# ఆముఖము



బాలురకు నీతులను దెలుపుటకై పెక్కండ్రు పెక్కు గ్రంథములను రచించియున్నారు. వానిలోఁ గొన్నిటికి భాషా గౌరవమును మఱికొన్నిటికిఁ గథా గౌరవమును మాత్రమే కలవని కొందఱు తలఁచుచున్నారు.

అన్నివిధములను గౌరవము వహింపవలయు ననెడి తలంపుతో నాయా తరగతులకుఁ దగిన నీతులును భాషయు నుండునట్లుగా రెండవ మూఁడవ నాల్గవ ఐదవ తరగతులకు "నీతి దీపావళి" అనెడి గ్రంథమును నాలుగు ఖండములుగా రచించినాఁడను.

నా దీపావళికి స్నేహము సంస్కృత భారత పంచతంత్రాది గ్రంథములందు లభించినది.

నేను జూపిన సంగతు లెట్టివో యని యధికారు లాలోచించి నా గ్రంథగౌరవమును గాపాడఁ గోరెదను.

ఈ నీతి దీపావళికి విజయవాచక ప్రకాశకులే ప్రకాశకులుగా నుండుట కెంతయు సంతసించుచున్నాఁడను.

కాటకోటేశ్వరము
17-12-32

ఇట్లు
భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి



# విషయసూచిక




ICH DIEN

శ్రీ రామ

# నీతిదీపావళి

## ప్రథమ ఖండము

—( మొదటి దీపము )—

### గాలవుఁడు

ఉద్దాలకుఁడు అను ఋషి ఒకఁడు ఉండెను. ఆయన దగ్గఱ వేదము చదువుకొనుటకు ఒక బాలుఁడు వచ్చెను. ఆ బాలుని పేరు గాలవుఁడు.

అతఁడు మంచి నడవడి కలవాఁడు. గురువుగారు చెప్పి నట్లు పాఠములను బాగుగా చదువుకొనెడి వాఁడు. అందు చేత గురువుగారు ఆతనిమీఁద ఎంతో దయ కలిగి ఉండెను.

ఆ ఉద్దాలకుఁడు శిష్యులను వెంటను పెట్టుకొని పోయి పొలములో సేద్యము చేయుచుండెడి వాఁడు. ఒకనాఁడు అధికముగా వర్షము కురిసెను. ఆ నాఁడు మిక్కిలి చలిగా ఉండెను. ఉద్దాలకుని పొలము యొక్క గట్టు తెగి నీరు

అంతయును ఆవలికి పోవుచుండెను. ఆ సంగతి ఆయనకు తెలిసినది. వెంటనే శిష్యులతో 'పొలమునకు పోయి గట్టు వేసి' రండు అనెను. ఆ నాఁడు చలిచేత ఎవ్వఁడును కదలలేదు. గాలవుఁడుమాత్రము "గురువుగారిమాట మీఱరాదు; నేను పొలమునకు పోయి గట్టువేసెదను" అని పొలములోనికి పోయెను.

ఆ గాలవుఁడు గట్టు తెగిన చోట ఎంత మన్ను వేసినను నీరు ఆవలికి పోవుచుండెను. అట్లు చేసి చేసి తుదకు గాలవుఁడే గట్టుతెగిన చోట అడ్డముగా పండుకొనెను. నీరు వెలుపలికి పోక పొలములో నిల్చెను.

ఎంతో రాత్రి అయినది. గాలవుఁడు ఇంటికి రాలేదు. ఆ సమాచారము ఉద్దాలకునకు తెలిసినది. వెంటనే పొలములోనికి పోయెను. గాలవుఁడు గట్టు తెగిన చోట అడ్డముగా పండుకొని నీరు నిలుపుటను చూచెను. అతని గురుభక్తికి మెచ్చుకొని ఉద్దాలకుఁడు గాలవునకు సకల విద్యలు బాగుగా వచ్చునట్లు చేసెను. అందుచేత గాలవుఁడు అందఱికంటెను గొప్పవాఁడు అయ్యెను.

—: ప్రకాశము :—

"గురువును దైవముగ నమ్మి పూజచేయు వారలకు చదువు చక్కఁగా వచ్చును".



—( రెండవ దీపము )—

# మేక—నక్క

ఒక నక్క నీరు త్రాగి దాహము తీర్చుకొనుటకు ఒక నూతి దగ్గఱకు పోయెను. ఆ నూతిలో నీరు కొంచెము లోఁతుగాఁ ఉండెను. ఆ నీరు అందుకొనపోవుచుండ కాలుజాఱి ఆ నక్క నూతిలో పడిపోయెను. ఆ నక్క పైకి వచ్చుటకు తన శక్తి కొలఁదిని ప్రయత్నము చేసెను; కాని పైకి రాలేకపోయినది.

అప్పుడు మేఁక ఒకటి నీరు త్రాగుటకు అచ్చటకే వచ్చినది. ఆ బావిలోనికి తొంగి చూచినది. అప్పుడు నూతిలో పడి ఉన్న నక్కను "ఈ బావిలోని నీరు తియ్యగా ఉన్నదా? ఉప్పగా ఉన్నదా?" అని మేఁక అడిగెను. ఆ నక్క "ఈ నీరు తియ్యగా ఉన్నది అని చెప్పుట కాదు. అమృతమే! రుచి చూచి మాట్లాడవలయును. ఎంత త్రాగినను నాకు తనివి తీఱకున్నది. అందుచేత నాకు పైకి వచ్చుటకు ఇష్టము లేకున్నది" అని బదులు చెప్పెను.

పాపము! ఆ మేఁక నక్క యొక్క మాయమాటలు నమ్మినది; వెంటనే ఆ బావిలోనికి గుభాలున ఉఱికినది.

అంత నక్క "బ్రతికితిని బాబూ!" అనుకొని ఆ మేక యొక్క పొడుగు అయిన కొమ్ముల మీఁదికి ఎక్కి బయటికి వచ్చెను. తన ప్రాణములను రక్షించుకొనెను.

మేక నీటిలో మునిఁగి మునిఁగి తుదకు చావవలసి వచ్చెను.

—:ప్రకాశము:—

"మోసము చేయువారలు మిక్కిలి తియ్యగా మాట్లాడుదురు. వారి మాటలను నమ్మి మోసపోకూడదు"



—( మూఁడవ దీపము )—

# బాలచంద్రుఁడు

ఒక గ్రామములో బాలచంద్రుఁడు అను బాలుఁడు ఉండెను. ఆ బాలుఁడు పొరుగూరిలో జరుగుచున్న అమ్మవారి జాతర చూచుటకు పోవుచుండెను. దారిలో ఆ బాలునకు దాహము ఆఁకలి విశేషముగా అయ్యెను. ఆ చుట్టు ప్రక్కలయందు చెఱువులు కాని బావులు కాని లేవు. ఎండ వేఁడిమి అధికముగా ఉండెను. ఆ బాలునకు ఒక చోటను ఒక మామిడిచెట్టు కాన్పించినది.

ఆ చెట్టు క్రిందికి వచ్చి చూడఁగా ఒక మామిడిపండు క్రింద పడి ఉండెను. ఆ పండును సంతోషముతో చేతను పట్టుకొని చెట్టుపైకి చూచెను. అచ్చట ఎంతో మంచిపండు కాన్పించినది. దానిని తినుట మంచిది అనుకొనెను. చేతిలో ఉన్న పండును దూరముగా విసరివైచెను. ఆ చెట్టు చిగురునందు ఉన్న ఆ పండును రాలఁగొట్టుటకు ఎన్నియో రాలను ఉవ్వెను. అట్లు ఉవ్వుటచేత ఆ బాలునకు ఆయాసము వచ్చెను; కాని పండు రాలి క్రింద పడలేదు.

అంత ఆ బాలుఁడు విసిగికొనుచు "బుద్ధిలేని వాఁడను అయి చేతికి అందని పండునకు ఆశించితిని; చేతిలో ఉన్న దానిని పాఱవేసికొంటిని" అని వెడలిపోయెను.

—:ప్రకాశము:—

"అందని దానికొఱకు ఆశపడి చేతిలో ఉన్నదానిని పోఁగొట్టుకొనరాదు"



—( నాలుగవ దీపము )—

# పేరాస గల నక్క

ఒకనాఁడు ఒక నక్క తన ఆహారమునకు వెదకు కొనుచుండెను. ఏమియు దొరక లేదు. తిరిగి తాను నివసించు స్థలమునకు పోవుచుండెను. అప్పుడు దానికి దారిలో ఒక కోడిపిల్ల కాన్పించినది. ఆ కోడిపిల్లను బలవంతముగా చంపి నోటితో కఱచుకొని పోవుచుండెను. అప్పుడు దారిలో ఉన్న ఏటిఒడ్డున ఒక మొసలి పండుకొని ఉండెను. దానిని చూచి "నాకు చాల ఆహారము దొరకినది" అనుకొనెను. నోటిలో ఉన్న ఆ కోడిపిల్లను తటుకున ఆవలకు పాఱవైచెను. నిద్ర పోవుచున్న మొసలి దగ్గఱకు పోయెను. ఆ మొసలి దీని చప్పుడు విని మేల్కొని వెంటనే నీటిలోనికి పోయెను. ఆ సమయములో ఒక గ్రద్ద వచ్చి ఆ కోడిపిల్లను ఎత్తుకొని పోయెను. అంత నక్క తనకు కలిగిన దురాశను నిందించుకొనుచు పోయెను.

—: ప్రకాశము :—

"దురాశ దుఃఖమును కలిగించును"



—( ఐదవ దీపము )—

# హంస—కాకము

ఉజ్జయిని అను పేరుగల పట్టనము ఒకటి కలదు. ఆ నగరమునకు పోవు దారిలో గొప్ప రావిచెట్టు ఒకటి ఉండెను. ఆ చెట్టుమీఁదను ఒక కాకి యును హంస యును స్నేహముతో నివసించుచుండెను.

ఒక బాటసారి వేసవి కాలములో ఆ దారివెంటను ఉజ్జయినికి పోవలసి వచ్చెను. అతఁడు ఎండ వేఁడిమి చేత నడువలేక ఆ చెట్టు క్రిందికి వచ్చి పండుకొని నిద్ర పోవుచుండెను. చెట్టునీడ ఎప్పుడును ఒకచోటనే ఉండునా! ఉండదు. కొంత సేపటికి ఆ చెట్టునీడ ఆతని ముఖముపైని ఉండి తొలఁగిపోయెను. అందుచేత ఎండ ఆతని ముఖముపైకి వచ్చెను.

హంసకు జాలి కలదు. కనుక ఆ బాటసారి యొక్క ముఖమునకు ఎండ తగులకుండ తన రెక్కలను చాపుకొని గొడుగు వలె పట్టి నిలుచుండెను.

కాకి ఇతరుల యొక్క మేలు చూచి ఓర్వలేని పక్షి. అందుచేత తాను వేఁపపండును తిని మిగిలిన గింజను పండుకొని నిదురపోవుచున్న ఆ బాటసారి నోటిలో పడవైచి ఎగిరిపోయెను. ఆ గింజ నోటిలో పడుటచేత బాటసారి కండ్లు

తెఱచి పైకి చూచెను. అప్పుడు అతనికి ఎండ తగులకుండ రెక్కలను గొడుగుగా పట్టుకొని నిలిచి ఉన్న హంస మాత్రమే అగపడినది. "ఈ పాడు పిట్టయే నా నోటిలో వేపగింజను పడవేసినది" అని కోపించి తన ప్రక్కలో ఉన్న కఱ్ఱతో ఒక దెబ్బ కొట్టెను. ఆ దెబ్బతో హంస చచ్చి పోయినది.

—: ప్రకాశము: —

"చెడ్డ పిల్లవాండ్రతో సహవాసము చేయు మంచి పిల్లవాండ్రకు కీడు సంభవించును; కావున అట్టి వారితో స్నేహము చేయరాదు"



—( ఆఱవ దీపము )—

## గోపాలుఁడు, మధుర

ఒక గ్రామములో గోపాలుఁడు అను బాలుఁడు ఉండెను. అతఁడు ఎల్లప్పుడును చెడ్డపనులు చేయుటకు అలవాటు పడి ఉండెను. అతనికి మధుర అను చెల్లెలు ఉండెను. ఆ పిల్ల మిక్కిలి తెలివి కలది. ఆమె ఇతరుల వస్తువులను చేతితోడను అయినను తాఁకి ఎఱుఁగదు.

ఒక నాఁడు ఆ ఇద్దఱును ఒకరి ఇంటికి ఆడుకొనుటకు పోయిరి. ఆ ఇంటను ఆడుకొనుటకు కొన్ని మంచి బొమ్మలు కనఁబడినవి. ఆ గోపాలుఁడు చెల్లెలితో "మధురా! ఈ బొమ్మలను ఎవరికిని తెలియకుండ మన ఇంటికి తీసికొని పోయి ఆడుకొందము! ఎవరికిని ఈ మాట చెప్ప వలదు" అనెను. మధుర "అన్నా! ఇతరుల యొక్క వస్తువులను మనము ముట్టుకొన వచ్చునా! వారి సెలవు లేనిదే మనము తీసికొని పోవుట తప్పు పని. అట్లు చేసిన ఎడల అందఱును మనలను దొంగలు అని చెప్పు కొందురు. అందుచేత ఎవరును మనలను తమ ఇండ్లలోనికి రానీయరు" అనెను.

ఆ సంగతి ఎట్లో వారి తండ్రికి తెలిసినది. ఆయన తన కుమార్తెను పిలిచి "అమ్మా! నీవు గోపాలుని కంటెను చిన్నదానవు; అయినను బుద్ధి కలదానవు. అతఁడు ఏండ్లకు పెద్దవాఁడు అయినను బుద్ధిలేని వాఁడు. బుద్ధిలేని వారు ఎప్పుడును చెడ్డ పనులు చేయుటకు చూచుచుందురు. అందు చేత వారికి అనేక కష్టములు వచ్చుచుండును. నీకు మాత్రమే ఆడుకొనుటకు నేఁడు కొన్ని మంచి బొమ్మలను కొని ఇచ్చెదను. ఆ గోపాలుఁడు తుంటరి కావున అతనికి ఏమియును కొనిపెట్టను" అనెను. మధుర మంచిగుణము కలది అగుట చేత తండ్రి ఆమెకు మంచి బొమ్మలు కొని ఇచ్చెను.

—: ప్ర కా శ ము :—

"ఇతరుల యొక్క వస్తువులను వేనిని గాని వారి యనుమతి లేనిదే అంటరాదు"

---

—( ఏడవ దీపము )—

# దేవదత్తుఁడు

ఒక గ్రామములో దేవదత్తుఁడు అను పేరు కల బాలుఁడు ఒకఁడు ఉండెను. అతనికి ఒక నాఁడు వీథిలో ఆడుకొనుచున్నపుడు బంగారు నాణెము ఒకటి దొరకినది. అతఁడు సంతోషముతో దానిని చేతితో పట్టుకొని "ఇతరులకు తెలియకుండ దీనిని జాగ్రతగా దాఁచుకొనెదను" అని ఇంటికి తీసికొని పోవుచుండెను.

అపుడు "నీవు దేవుని చూడలేకపోయినను దేవుఁడు నీవు చేసెడి పనిని చూచుచు ఉండును" అను మాట జ్ఞాపకమునకు వచ్చినది. తల్లిదండ్రులును ఉపాధ్యాయుఁడును కూడ వానికి ఆ మాటను చెప్పిరి. అందుచేత ఆ బాలునకు ఇతరుల సొమ్ము దొరకినపుడు దాఁచుట తప్పు అని తోఁచినది. "దీనిని నేను దాఁచుకొనక పోయినవానిని కనిపెట్టి ఇచ్చివేయుదును"

అని అనుకొనెను. ఆ నాణెమును పాఱవేసికొనినవాఁడు ఎవఁడు అని ఆలోచించుచుండెను.

అప్పుడు ఒక బీదవాఁడు పోయిన తన నాణెము కొఱకు ఏడ్చుచు వెదకికొనుచు వచ్చుచుండెను. ఆ దేవ దత్తుఁడు అతని మీఁద జాలి కలిగి "ఎందులకు ఏడ్చు చున్నావు! దేనికై వెదకుచున్నావు" అని అడిగెను.

ఆ బీదవాఁడు "నాయనా! నేను చాలకాలము కష్ట పడి బంగారు నాణెమును సంపాదించుకొంటిని. దానిని ఈ దారిలో ఎక్కడనో పాఱవేసికొంటిని; దానికై వెదకి కొనుచున్నాను" అనెను.

ఆ బాలుఁడు "ఇదిగో! నాకు ఒక బంగారు నాణెము దొరకినది. నిజముగా ఇది నీది అయిన పక్షమునందు తీసి కొనుము" అని వానికి ఇచ్చెను. ఆ బీదవాఁడు దానిని తీసి కొని మిక్కిలి సంతోషించుచు ఇంటికి పోయెను.

—:ప్రకాశము:—

"మనకు దొరకిన వస్తువులను అపహరింపక పోఁగొట్టు కొనిన వారలను గనిపెట్టి ఇచ్చినపుడు వారు సంతోషింతురు. దేవుఁడును సంతోషించును"



—( ఎనిమిదవ దీపము )—

# మనుష్యుఁడు—ఎలుఁగుబంటి

ఒక అడవిలో ఒక ఎలుఁగుబంటియును మనుష్యుఁడును మిక్కిలి స్నేహముతో ఉండెడివారు. వారు ఒక నాఁడు ఆ అడవిలో చాల దూరము నడచుటవలన మిక్కిలి అలసిపోయిరి. ఆ అలసట తీర్చుకొనుటకు వారు ఒక చెట్టు క్రింద పండుకొనిరి.

అప్పుడు ఆ మనుష్యుని యొక్క మొగము మీఁద ఈఁగలు వ్రాలి మిక్కిలి బాధించుచుండెను. "ఆ ఈఁగలను తన స్నేహితుని మొగముపై నుండి తోలివేయ వలయును" అని ఎలుఁగుబంటి తలఁచెను.

అందుచేత అది తన అరచేతితో స్నేహితుని మొగము మీఁద వ్రాలిన ఈఁగలను చచ్చునట్లు గట్టిగా కొట్టెను. ఆ దెబ్బతో ఆ ఈఁగలు అన్నియును చచ్చిపోవుటయే కాక ఆతఁడును ఎలుఁగుగోడ్డు యొక్క వ్రేళ్లు గ్రుచ్చుకొని ఎంతో రక్తము కారి చచ్చిపోయెను.

—: ప్రకాశము :—

"మనము చేయు సేవ మంచిఫలమును ఇచ్చునా! చెడ్డ ఫలమును ఇచ్చునా! అని ముందుగా ఆలోచింపక చేయరాదు"



—( తొమ్మిదవ దీపము )—

# కోపముకల సుశర్మ

మధురానగరములో సుశర్మ అను బ్రాహ్మణుఁడు ఒకఁడు ఉండెను. ఆయన బాగుగా చదువుకొనెను; కాని ఆయనకు కోపము అధికముగా ఉండెను. ఆయన యొక్క గుణములను గూర్చి ఒక నాఁడు ఒకరి ఇంటిలో కొందఱు కూడి చెప్పుకొను చుండిరి. వారిలో పురుషోత్తముఁడు అనువాఁడు "అన్ని గుణములు మంచివే; కాని ఆయనకు రెండు గుణములు మంచివి కావు. అందు మొదటిది అధిక కోపము; రెండవది ముందు వెనుకలు చూడక చేసెడి సాహసము" అనెను.

ఏదియో ఒక పనిమీఁద ఆ ఇంటికి వచ్చి చాటున నిలిచి ఆ మాటలను అన్నిటిని సుశర్మ వినెను. వెంటనే అతఁడును లోపలికి పోయి పురుషోత్తముని మెడకు తన ఉత్తరీయమును చుట్టి ముందునకు ఈడ్చి "ఏది! చూపుము! నాకు కోపమును, సాహసమును అధికముగా ఉన్నవి అని అను చున్నావు. అట్లు నా యందు చూపక పోయిన ఎడల నీ ప్రాణములను తీయుదును. చూడుము నా ప్రజ్ఞ" అనెను.

అప్పుడు అక్కడ ఉన్నవారు అందఱును పకపక నవ్వుచు "నీవు పురుషోత్తముని మెడకు నీ ఉత్తరీయమును

నెట్టితివి; ముందునకు ఈడ్చితివి; కోపము చూపకుండిన ఎడల చంపుదును అంటివి. అవే నీకు కల కోపమును సాహసమును తెలుపుచున్నవి" అనెను.

అంత సుశర్మ నోరు మూసికొని ఊరకుండెను.

—: ప్రకాశము: —

"ఇతరులు మన చాటున అన్నమాటలను పట్టి కోపము తెచ్చుకొనరాదు"



—( పదవ దీపము )—

# మోటుతనము గల శిష్యులు

ఒక ఉపాధ్యాయుని దగ్గర ఇద్దరు బాలురు చదువుకొనుచుండిరి. వారు ఇద్దరును ఎప్పుడును పోట్లాడుకొనుచుండెడి వారలు. ఒకడు చేసిన పని అన్న మఱి ఒకనికి పనికి రాక ఉండెను. ఆ గురువుగారి యొక్క కుడికాలు ఒక శిష్యుడును, ఎడమకాలు మఱియొక శిష్యుడును నిత్యమును కడుగుచుండిరి. ఒక నాడు కుడికాలు కడుగుచుండెడి శిష్యుడు పని మీద పొరుగూరికి పోయెను. అప్పుడు గురువుగారు ఎడమకాలు కడిగెడి శిష్యునితో నేడు కుడికాలు కూడను నీవే

కడుగుము" అని చెప్పెను. దానికి వాఁడు కోపగించుకొని "నాకు శత్రువు అగువాఁడు కడిగెడి కాలును నేను కడగను, వాని పొగరు అణఁచెదను" అని ఒక ఱాయి తెచ్చి గురువుగారి కుడికాలిమీఁదను కొట్టెను. మఱువాఁడు రెండవవాఁడు వచ్చి "నేను కడిగెడి కాలును వీఁడు ఱాతితో కొట్టెను. కావున నేనును వాఁడు కడిగెడి కాలును కొట్టెదను" అని మఱియొక ఱాతితో ఎడమకాలిపై కొట్టెను. గురువుగారు దాని మూలమున చాల బాధపడిరి.

—:ప్రకాశము:—

"పట్టుదల గల మూర్ఖులు వారలు ఇతరులకు అపాయము సంభవించు చున్నను జూడక తమ పట్టు నెఱవేర్చుకొనుటకే చూచుచుందురు"



—( పదునొకండవ దీపము )—

# తపోదత్తుఁడు

ఒక నగరములో తపోదత్తుఁడు అను బ్రాహ్మణుఁడు ఉండెను. అతని తండ్రి వానిని చిన్నతనములో "బడికిపోయి చదువుకొనుము" అని ఎంత బాధించినను చదువుకొనుటకు బడికి వెళ్ళెడివాఁడు కాఁడు. అంత కొంతకాలమునకు జనులు

అతనిని "చదువులేని వాఁడు; బండవాఁడు" అని నిందించుటకు మొదలు పెట్టిరి. దానికి అతఁడు సిగ్గుపడుచు ఒకనాఁడు ఇట్లు అనుకొనెను:—"నేను గంగానదియొక్క ఒడ్డునందు కూర్చుండి తపస్సు చేయుదును. అందుచేత నాకు ఎంతో విద్య వచ్చును. నేను పెద్దవాఁడను అను మాట అక్కఱలేదు" అని గంగానదియొక్క ఒడ్డున కూర్చుండి తపస్సు చేయుటకు మొదలు పెట్టెను. వానిని ఎఱిఁగిన ఒక మనుష్యుఁడు "పాపము! వీఁడు ఇంటి దగ్గఱ భార్యను పిల్లలను వదలిపెట్టి వచ్చి వ్యర్థముగా తపము చేయుచున్నాఁడు. శ్రద్ధకలిగి క్రమముగా బడికి పోవుచుండెడి బాలురకు చదువు వచ్చును; కాని ముక్కు మూసుకొని ఒక చోటను కూర్చుండి తపము చేయువానికి చదువు రాదు. ఇది మాన్పవలయును" అనుకొనెను. అతఁడును ఆ గంగానది ఒడ్డునకు వచ్చి ఒడ్డున ఉన్న ఇసుకను దోసిలితో ఎత్తి కెరటములతో వడిగా ప్రవహించుచున్న గంగలో వడ వేయుచుండెను. అది తపోదత్తుఁడు చూచి "ఓరి! మూర్ఖుఁడా! ఎందులకు దోసిళ్లతో ఒడ్డున ఉన్న ఇసుకను ఊరక గంగలో పోయుచున్నావు. నీకు పిచ్చి ఎత్తినదా ఏమి!" అనెను. దానికి వాఁడు "మనుష్యులు అందఱును ఈ గంగానదిని దాఁటి పోవుటకు సేతువును కట్టుచున్నాను" అనెను. ఆ మాటకు తపోదత్తుఁడు "ఓరి!

తెలివితక్కువ వాఁడా! నీవు పోయుచుండెడి ఇసుక ఎప్పటికి అప్పుడే నీటిలో కొట్టుకొని పోవుచున్నదే! సేతువు ఎట్లు కట్ట నేర్తువు!" అనెను. దానికి ఆ మనుష్యుఁడు "నీవు ఎట్లు బడికి పోక పాఠములను చదువుకొనక తపస్సు తోడ విద్యను సాధించుటకు తలఁచుచున్నావో అట్లే నేనును దోసిలితో ఇసుకను నదిలో పోసి సేతువు కట్టవలెను అని తలఁచితిని" అనెను అందులకు తపోదత్తుఁడు బుద్ధి తెచ్చుకొని తపస్సు చాలించి ఇంటికి పోయెను.

—:ప్రకాశము:—

"చిన్నతనములో క్రమముగా బడికి పోయి బాగుగా పాఠములు చదువుకొనిన బాలురకే విద్య వచ్చును; కాని వ్రతములు మొదలయిన వానిని చేయువారలకు విద్యరాదు"



—( పండ్రెండవ దీపము )—

## తెలివి గల బాలుఁడు

ఒక బాలుఁడు ముగ్గురు స్నేహితులతో కూడి పొలములో ఉన్న నూతిచెంతకు ఆడుకొనుటకు వెళ్ళెను. ఆ బాలుని దేహమునిండ బంగారు నగలు ఉండెను. ఆ నగ

లను దొంగిలింప వలయును అని ఒక దొంగ ఆ బాలుర వెంట ఆ నూతి దగ్గఱకు వచ్చెను.

ఆ బాలుఁడు మిక్కిలి తెలివికలవాఁడు; ఆ దొంగకు భయపడుచున్నను వానిని "ఉపాయముచేత మోసపుచ్చ వలయును" అని అనుకొనెను. అంతట అతఁడు నూతిలోనికి చూచుచు గొంతెత్తి ఏడ్వసాగెను.

ఆ దొంగ వానిని ఓదార్చువాని వలె దగ్గఱకు వచ్చి "బాలుఁడా! ఎందులకు ఏడ్చుచున్నావు" అనెను. ఆ బాలుఁడు ఉపాయము కలవాఁడు; కావున ఏడ్చుచు నా స్నేహితులు మిక్కిలి విలువ గల నా రత్నాల హారమును ఈ నూతిలో పడవైచిరి. ఇంటికి పోయినప్పుడు మా తల్లి దండ్రులు నన్ను కొట్టుదురు; నాకు అన్నము పెట్టరు. నా యందు దయ ఉంచి నా రత్నాల హారమును పైకి దీసి ఇమ్ము! అట్లు చేసినపక్షమునందు నా తల్లి దండ్రులచేత నీకు గొప్ప బహుమానము ఇప్పింతును" అనెను. "ఆ బాలుఁడు తన్ను వంచించు చున్నాఁడు" అని ఆ దొంగ ఎఱుఁగక నిజము అని నమ్మి తన బట్ట లను విప్పి నూతి ఒడ్డున పెట్టెను. గోచి పెట్టుకొని నూతిలో దిగి హారముకొఱకు వెదకి వెదకి కానక విసుఁగు చెందు చుండెను. అప్పుడు ఆ బాలుఁడు ఆ దొంగ యొక్క బట్ట

లను తాను పట్టుకొని పరుగెత్తుకొని పోవుదము అని తన స్నేహితులకు కంటితో సంజ్ఞ చేసెను. వారు అచ్చట నుండి తప్పించుకొని పారిపోయిరి.

ఆ దొంగ హారము నూతిలో లేకపోవుటచే పైకి వచ్చి కాలికొలఁదిని పరుగెత్తుకొని పోవుచున్న బాలురను చూచి తన తెలివిలేమికి మిక్కిలి విచారించెను.

—:ప్రకాశము:—

"తెలివి గల బాలురు ఉపాయముచేత కష్టములను తప్పించుకొందురు"



—( పదుమూఁడవ దీపము )—

# వీరయ్య

వీరయ్య అనువాఁడు ఒక గ్రామాధికారి దగ్గఱ భృత్యుఁడుగా ఉండెను. ఒకనాఁడు వాఁడు నూనె తెచ్చుటకు గిన్నెను పట్టుకొని బజారునకు పోయెను.

ఆ గిన్నెలో నూనె పోయించుకొని ఇంటికి తిరిగి వచ్చుచుండెను. దారి వెంటను పోవుచుండెడి కొందఱు

వానిని చూచి "ఓయి! నూనె ఆ గిన్నెలోనుండి క్రిందికి కారుచున్నది. జాగ్రతగా చూచుకొనుము" అని చెప్పిరి.

ఎట్లు కారిపోవుచున్నదో చూచుటకు ఆతఁడు తెలివి లేనివాఁడు అగుటచే గిన్నెను తల క్రిందుగా త్రిప్పి చూచెను; అట్లు త్రిప్పి చూచినపుడు గిన్నెలో నున్న నూనె అంతయు క్రింద పడిపోక నిలుచునా! నూనె అంతయు క్రింద పడి పోయినది.

ఇంటికి పోవునపుడు గ్రామాధికారి వానిపై కోప గించి వెడల కొట్టెను.

—: ప్రకాశము: —

"కలుగఁబోయెడి నష్టమును కనిపెట్టె కాని కార్యము లను చేయరాదు"



—( పదునాలుగవ దీపము )—

## హరదత్తుఁడు

ఒక నగరములో హరదత్తుఁడు అను బ్రాహ్మణుఁడు కలఁడు. పాపము! ఆయన ఎంత కష్టపడి సేద్యము చేసి

కొనుచున్నను వాని పొలము పండుట లేదు. ఒకనాఁడు ఆ బ్రాహ్మణుఁడు ఎండవేడిమి అధికముగా ఉండుటచేత తన పొలములో ఉన్న ఒక చెట్టుక్రింద పండుకొని ఉండెను. ఆ చెట్టునకు దాపున ఒక పుట్ట ఉండెను. ఆ పుట్టను ఉండి ఒక త్రాఁచుపాము పైకి వచ్చుచుండెను.

దానిని చూచి ఆ బ్రాహ్మణుఁడు "ఇది నిజముగా నా పొలమునకు దేవత; ఇన్నినాళ్లనుండి దీనిని పూజించుట మఱచిపోయితిని. అందుచేతనే నా పొలము పండుట లేదు. నేఁడు తప్పక దీనికి పూజ చేయుదును" అనుకొనెను. ఇంటికి పోయి ఒక మూఁకుడులో పాలు పోసి తీసికొని వచ్చి ఆ పుట్టదగ్గఱ పెట్టెను. "ఓ దేవతా! ఇంతకాలమునుండి నీవు ఇచ్చట ఉన్నావు అని నాకు తెలియదు. అందుచేత నీకు పూజ చేయలేదు. క్షమించుము" అని వేఁడుకొని ఇంటికి పోయెను.

మఱునాఁడు వచ్చి చూడఁగా ఆ మూఁకుడులో దీనారము (బంగారు నాణెము) ఒకటి కాన్పించెను. అట్లే ప్రతి దినమును ఆతఁడు పాలు మూఁకుడుతో తెచ్చి పెట్టుచుండెను. ఒక్కొక్క దీనారమును ఆ మూఁకుడులో కనఁబడుచుండెను.

ఒకనాఁడు ఆ బ్రాహ్మణుఁడు తాను ఒక పని చేయుచు "పాలు పట్టుకొని పోయి పుట్ట దగ్గఱ పెట్టుము" అని కొడుకును పంపెను. ఆతఁడును పాలు పట్టుకొని వెళ్ళి పుట్టదగ్గఱ పెట్టి మఱునాఁడు పోయి చూడఁగా మూఁకుడులో ఎప్పటి వలె దీనారము ఒకటి కాన్పించినది. దానిని చూచి ఆ బ్రాహ్మణుని కుమారుఁడు "నిజముగా ఈ పుట్ట నిండ దీనారములు ఉన్నవి. ఈ పామును చంపివైచి ఆ దీనారములను అన్నిటిని ఒక్కమాఱే తీసికొందును" అనుకొని మరల ఇంటికి పోయి పాలు తీసికొని వచ్చి పుట్టదగ్గఱ పెట్టెను.

ఆ సర్పము ఎప్పటివలె పాలు త్రాగుటకు పుట్టలో నుండి పైకి వచ్చెను. అప్పుడు ఆ కుమారుఁడు కఱ్ఱతో దాని తలపై ఒక దెబ్బ కొట్టెను. ఆ దెబ్బ తప్పించుకొని ఆ పాము వానిని కఱచెను. ఆ కాటుచే వాఁడు మృతి నొందెను.

—: ప్రకాశము :—

"పేరాస కలవారలు ఇతరులకు హాని కలిగించి అయినను తాము లాభమును పొందుటకు చూతురు. కాని ఆ అపాయము వారలకే సంభవించును"



—( పదునేనవ దీపము )—

# రంగయ్య

ఒకనాఁడు రంగయ్య అను వాఁడు అరణ్యములో తిరుగఁగా తిరుగఁగా దప్పిక విశేషముగా అయ్యెను. అతనికి ఒక చోట మిక్కిలి తేటనీటితో నిండి పాఱుచున్న ఏఱు ఒకటి అగపడినది. అతఁడు ఆ ఏటిలోనికి దిగలేదు; నీరు త్రాగలేదు; దాహము తీర్చుకొనలేదు. ఆ ఏటి గట్టునందు నిలిచి "అయ్యో! నన్ను దప్పిక ఎంత బాధించుచున్నది!" అని మాత్రము ఏడ్చుచుండెను.

ఆ చెంతను ఉండిన ఒకఁడు "ఓ తెలివిహీనుఁడా! ఈ ఏటినిండ తేటయైన నీరు కలదు కదా! ఏల ఏటిలోనికి దిగి దాహము తీర్చుకొనకున్నావు! ఊరక దాహము దాహము అని ఏల ఏడ్చెదవు" అని అడిగెను. అందులను అతఁడు తన చూపును అంతయును నీటివంక నిల్పి "దేవుఁడా! ఈ నీరెల్ల నే నెట్లు త్రాగఁగలను" అని ఏడ్చుచుండెను.

అంతట రెండవ వాఁడు పరిహాసముగా "ఈ నీరు అంతయును త్రాగివేయవలయును అని అనుకొనుచున్నావు కాఁబోలును. అట్లు త్రాగక పోతివేని అధికారులు నిన్ను తప్పక దండింతురు. శీఘ్రముగా త్రాగుము" అనెను.

అట్లు పరిహాసము చేసి చెప్పినను రంగయ్య తెలిసి కొనలేక ఎట్లు అయినను పటిలో ఉన్న నీరంతయును త్రాగివేయవలయును అనియే చూచుచుండెను.

—: ప్ర కా శ ము :—

"ఆలోచన లేనివారలు కార్యము అంతయు చేయ లేకపోవుటయే కాక శక్తికొలఁదిని కొంత పని అయినను చేయుటకు తలపెట్టరు"

—( పదునాఱవ దీపము )—

# మహీదాసుఁడు

రంగాపురములో మహీదాసుఁడు అనువాఁడు ఒకఁడు ఉండెను. అతఁడు కూలిపని చేసి ఎంతో దూది సంపాదించుకొనెను. ఒకనాఁడు ఆ దూదిని అంతయును మూట గట్టుకొని అంగడివీథికి అమ్మకొనుటకు పోయెను. ఆ దూది మంచిది కాకపోవుటచేత ఎవ్వరును వానిని కొనలేదు.

అప్పుడు రంగయ్య మంచి బంగారమును కొనుటకు బంగారము అమ్మెడి దుకాణమునకు పోవుచుండెను. ఈ రంగయ్య దూది అమ్మ మహీదాసుని కూడ బంగారు

దుకాణము దగ్గఱకు తీసికొనిపోయెను. రంగయ్య బంగారు దుకాణమువానితో "మంచి బంగారము కొనుటకు వచ్చి నాఁడను" అని చెప్పెను. అప్పుడు దుకాణములో ఉన్న వాఁడు "ఇదిగో చూడుము! ఇది మంచి బంగారము" అని కుంపటిలో వేసి కాల్చి చూపెను.

అప్పుడు రంగయ్య తాను కొనఁదలఁచిన దూది మంచిది అగునో కాదో అని బంగారమును నిప్పులో వేసి చూచిన విధముగానే చూడవలయును అని అనుకొనెను. కొంచెము నిప్పును తీసికొని వెళ్లి ఆ మూటలో పడ వైచెను. అచ్చట ఉన్నవారలు "వలదు వలదు" అని చెప్పు నంతలో దూది అంతయును కాలిపోయి మహీ దాసునకు అపాయము సంభవించెను.

—: ప్రకాశము :—

"మంచి చెడ్డలను తెలిసికొనుటకు సకల వస్తువులను ఒక విధముగా పరీక్షింపరాదు. వస్తువు యొక్క గుణ మును పట్టి చూడవలయును. అట్లు చేయకున్న అపా యము కూడ వచ్చును"



—( పదునేడవ దీపము )—

# చెవిటి వాఁడు

ఒక చెవిటివాఁడు జ్వరముచేత బాధపడుచున్న తన స్నేహితుని చూచుటకు బయలుదేరెను. దారి వెంట పోవుచు తనలో తాను ఇట్లు అనుకొనెను:— "నేను నా మిత్రుని ఇంటికి పోవుదును; మిత్రమా! జ్వరము యొక్క వేగము సహింపఁదగి ఉన్నదా! అందును. అతఁడు కొంచెము సహింపఁదగి ఉన్నది అనును. ఏమి ఔషధము తీసికొనుచున్నావు అందును. అతఁడు ఈ ఔషధము తీసికొనుచున్నాను అనును. నీకు వైద్యుఁడు ఎవఁడు? అందును. నాకు ఈతఁడు వైద్యుఁడు అనును. ఇంకను ఇట్లే కొన్ని మాటలు అడుగుదును" అనుకొని మిత్రుని ఇంటికి వెళ్ళి ఇట్లు మాట్లాడెను:—

చెవిటివాఁడు:— మిత్రమా! జ్వరము సహింపఁదగి ఉన్నదా!

రోగి:— అట్లే ఉన్నది.

చెవిటి:— భగవదనుగ్రహముచేత అట్లే ఉండును గాక! నీవు ఏమి ఔషధమును తీసికొనుచున్నావు?

రోగి:— (విసుగుకొని) మట్టి.

చెవిటి:— అదియే మంచిది; నీకు వైద్యుఁడు ఎవఁడు?

రోగి:— యముఁడు.

చెవిటి:— అతఁడే సమర్థుఁడు. వానిని వదలకుము!

అక్కడను ఉండి ఈ మాటలను విన్నవారలు "ఈ దుర్మార్గుఁడు నిష్కారణముగా యముని ఆశ్రయించి చచ్చిపోవుము అనుచున్నాఁడు" అనుకొని తిట్టి ఆతనిని సాగనంపిరి.

—: ప్రకాశము :—

"చెవిటివారలు ఎదుటి వారి మాటలు బాగుగా తెలిసిన పిమ్మట బదులు చెప్పవలయును; బాగుగా తెలిసికొనక చెవిటివారలు మాట్లాడుదురు కావున వారి మాటలను పట్టి వ్యర్థముగా కోపము తెచ్చుకొనరాదు"



—( పదునెనిమిదవ దీపము )—

## కొంగ

గంగానది యొక్క ఒడ్డున "శ్వేతాంగము" అను పేరు గల కొంగ ఒకటి ఉండెను. ఒకచోట కొందఱు కూడి హంసల యొక్క గుణములను చెప్పుకొనుచుండిరి. ఆ మాటలను ఆ కొంగ వినెను. "హంసలు ఎంతటివి!

మా జాతి మాత్రము గొప్పది కాదా! మా దేహము లును తెల్లగా ఉండును. మేమును నీళ్లలోనే వసించు చుందుము. ఈ మనుష్యులు బుద్ధిలేక హంసలను పొగడు చున్నారు. నేనును హంసల వలె ఇఁక తామరతూఁడు లను మాత్రమే తినుచుందును. చేఁపలను తినుట మాని వైచెదను" అని అనుకొనెను. పిమ్మట దానికి ఒక కొలను కాన్పించినది. ఆ కొలను నిండ తామర పూవులు కలువ పూవులు బాగుగా పూచి ఉన్నవి. ఆ కొంగ కొల నులో తిరుగుటకు మొదలు పెట్టెను. అందు ఉండెడి తెల్లని తామరతూండ్లను హంసల వలె తినుటకు ఆరం భించెను. "అన్ని విధముల చేతను హంసలాగున నడువ వల యును" అని ప్రయత్నము చేయుచుండెను.

ఒకనాఁడు ఒక బాలుఁడు స్నానము చేయుటకు ఆ కొలనులోనికి దిగెను. ఆ కొంగను పట్టుకొనెను. దానిని తన ఇంటికి తీసికొని పోయెను. ఇంటిలో ఉన్నవారలు "బాలుఁడా! నీకు పిచ్చిపట్టినదా ఏమి! కొంగను తీసి కొని వచ్చితివి; ఇది టక్కరి పిట్ట. ఇది కన్నులు మూసి కొని నీటిలో నిలుచుండును; తన కాలికి తగిలిన చేఁప లను తినుచుండును. ఇది పెంచుకొనుటకు తగనిది" అనిరి. ఆ బాలుఁడు ఇది హంస కాదా? అనెను. వారు ఇది కొంగ కాని హంస కాదు అనిరి. ఆ మాటకు కొంగకు

కోపము వచ్చినది. ఆ సంగతి అక్కడ ఉన్న తెలివికల వాఁడు ఒకఁడు కనిపెట్టెను. వాఁడు దానితో "ఓ కొంగా! నీవును తెల్లని దానవే! ఆ మాట అటు ఉంచుము! ఏదీ! నీ ప్రజ్ఞ చూపుము" అనెను.

ఆతఁడు పాలును నీరును కలిపి తీసికొని వచ్చి దాని ముందు పెట్టెను. ఆ కొంగ ఒక బొట్టు అయినను లేకుండ త్రాగినది. హంసలు అట్లు చేయునా! చేయవు అవి పాలు మాత్రమే త్రాగి నీళ్లను దిగవిడుచును.

అంతట వాఁడు ఆ కొంగను చూచి నవ్వెను! "ఓ కొంగా! ఎట్టి ఆహారమును తినినను నీ జాతి నీదే! హంస జాతి హంసదే! బండి లాగినంతమాత్రముచే గాడిద గుఱ్ఱము అగునా? పొమ్ము!" అని కొంగను విడిచి పెట్టెను.

అది సిగ్గుపడుచు ఎగిరి పోయెను.

—: ప్రకాశము. —

"శక్తి కొలఁదిని వేషము కాని భాష కాని ఉండ వలయును; అట్లు ఉండక గొప్పవారిలాగున నటించిన పక్షమునకు జనులు నవ్వుదురు"

—————

—( పందొమ్మిదవ దీపము )—

# చేఁపలు

ఒక చెఱువులో మూఁడు చేఁపలు ఉండెను. అందు మొదటి దానికి ముందు రాఁబోవు సంగతి తెలియును; రెండవ దానికి సమయమును పట్టి ఏమి చేయవలయునో తెలియును; మూఁడవ దానికి పట్టు పట్టుకొని ఉండుట తక్క మఱి ఏమియును తెలియదు.

ఆ చెఱువును కొందఱు పల్లెవాండ్రు చూచిరి. వారు "ఈ చెఱువునిండ చేఁపలు ఉన్నవి. ఇట్టి చెఱువును మనము ఇదివఱకు చూడలేదు. ఇప్పుడు సాయంకాలము అయినది. తెల్లవాఱుజామున రావచ్చును. కావలసినన్ని చేఁపలను పట్టుకొని పోవచ్చును" అనుకొనిరి.

ఆ మాటలు ఆ చేఁపలు వినినవి. అందులో మొదటి చేఁప చెఱువులో ఉన్న చేఁపలను అన్నిటిని పిలిచి "చేఁపలారా! మీరు పల్లెవాండ్రు చెఱువుగట్టు మీఁద అన్న మాటలు వింటిరి కదా! వారు తప్పక తెల్లవాఱుజామున వచ్చెదరు. ఈ చెఱువులో ఉన్న చేఁపలను వలలు వేసి పట్టుకొందురు. కావున ఈ రాత్రియే మనము అందఱము ఈ చెఱువును వదలిపెట్టవలయును; ఇఁక మనము ఏమియును అయినను ఇక్కడ ఉండఁగూడదు. సమీపములో

ఉన్న ఇంకొక చెఱువులోనికి పోవలయును. అట్లు చేయక పోయిన ఎడల మనకు చావు తప్పదు" అనెను.

అప్పుడు రెండవ చేఁప "మిత్రమా! నీవు చెప్పిన ఉపాయము బాగుగా ఉన్నది; మనము ఈ చెఱువులోనే ఉన్నయెడల నీవు చెప్పినట్లు మనకు చావు తప్పదు కావున ఇంకొక చెఱువులోనికి పోవలయును. వేఁకువ జామున జాలరులు వచ్చెదరు. మనలను వలలు వేసి పట్టి చంపుదురు" అనెను.

మూఁడవ చేఁప నవ్వుచు "మిత్రులారా! మీ ఆలోచన ఎంత మాత్రము బాగుగా లేదు. ఈ చెఱువులో మన తండ్రులు తాతలు ముత్తాతలు కూడ నివసించిరి. వారికి ఏ కీడును రాలేదు; మన పెద్దలు ఉన్నచోటును విడుచుట తప్పు పని; చావు ఎక్కడికి పోయినను తప్పదు. మనము ఈ చెఱువును విడువఁగూడదు. నేను మాత్రము రాను. మీ ఇష్టము వచ్చినట్లు చేయుఁడు!" అనెను.

అంతట మొదటి రెండు చేఁపలును కొన్ని చేఁపలను తీసికొని ఇంకొక చెఱువునకు పోయినవి. మూఁడవ చేఁప పోలేదు. తెల్లవాఱు జామున పల్లెవాండ్రు వచ్చిరి. వలలు వేసిరి; మూఁడవ చేఁపను దానితో ఉన్న మఱి[illegible] చేఁపలను పట్టుకొని పోయిరి.

—: ప్రకాశము :—

“అపాయము వచ్చు స్థలములను కనిపెట్టవలయును. తెలివితో వానిని విడిచిపెట్టవలయును; కాని పట్టుదల కలిగి వానియందే ఉండరాదు”

—( ఇఱువదవ దీపము )—

## బ్రహ్మదత్తుఁడు

ఒక గ్రామములో బ్రహ్మదత్తుఁడు అను పేరు గల బ్రాహ్మణుఁడు ఒకఁడు ఉండెను. అతఁడు ఒకనాఁడు ఒక పనికొఱకు వేఱొక గ్రామమునకు పోవుచుండెను. అప్పుడు అతని తల్లి “నాయనా! నీవు ఎక్కడికి పోవుచున్నను ఒంటరిగా మాత్రము పోకుము. ఇంకొకనిని తోడుగా తీసికొని పొమ్ము” అని చెప్పెను. ఆ బ్రాహ్మణుఁడు “అమ్మా భయపడకుము! దారిలో భయము ఏమియు ఉండదు! కార్యమును పట్టి ఒంటరిగా పోవలసి వచ్చినది” అనెను. అతని తల్లి “వీఁడు పోక మానఁడు; గట్టి పట్టు పట్టి ఉన్నాఁడు” అనుకొనెను.

అంతట ఆమె సమీపమునందు ఉన్న బావిదగ్గఱకు ఏమిమను ఒక పీతను దెచ్చెను. “నాయనా! నీవు తప్పక

పోవలసి ఉన్న పక్షమునందు దీనిని తీసికొని పొమ్ము" అని ఇచ్చెను. ఆతఁడును తల్లి యొక్క మాటయందు ఆదరము ఉంచి రెండు చేతులతోను దానిని తీసికొనెను.

అంతట ఆ పీతను కర్పూరముతో చేసిన చిన్న పెట్టెలో పెట్టెను. ఆ పెట్టెను ఒక పాత్రలో పెట్టుకొని శీఘ్రముగా బయలుదేఱి పోయెను. అప్పుడు ఎండ వేఁడిమి అధికముగా ఉండెను. అందుచేత ఆతఁడు దారిలో ఉన్న ఒక చెట్టునీడను పండుకొని నిద్రపోయెను.

ఆ చెట్టు తొఱ్ఱలో ఉండి పాము ఒకటి వాని కడకు వచ్చెను. పాములకు కర్పూరము అనిన మిక్కిలి ఇష్టము. అందుచేత కర్పూరముతో చేయఁబడిన ఆ చిన్న పుటికెను ఆ పాము ఆసతో మ్రింగెను. అందు ఉన్న పీత దాని ప్రాణములను తీసెను.

ఆ బ్రాహ్మణుఁడు లేచి చూచినపుడు పాము చచ్చి తన ప్రక్కను పడియుండెను. ఆతఁడు "ఈ పీతయే పామును చంపి నా ప్రాణములు రక్షించినది. మా అమ్మ గారు చెప్పిన మాట సత్యము అయినది. నేను ఒక్కడనే వచ్చినపక్షమున నా ప్రాణములు పోయెడివే" అనుకొనెను. తల్లిని పొగడెను.

—: ప్రకాశము :—

"ఏపనిమీఁదను అయినను వేఱొక గ్రామమునకు పోవలసి ఉన్నపక్షమునందు ఒంటరిగా పోవుట తగదు"



—( ఇరువదియొకండవ దీపము )—

# మునీశ్వరుఁడు—కుక్క

ఒక అడవిలో ఒక మునీశ్వరుఁడు ఉండెను. ఆయన ఎప్పుడును తపస్సు చేసికొనుచుండును. ఆ తపస్సు యొక్క మహిమము చేతనే ఆ అడవిలో ఉన్న పెద్దపులి మొదలయిన జంతువులు ఆయనయందు భక్తితో ఉండెడివి.

ఆ జంతువులలో ఒక కుక్క ఆయనయందు మిక్కిలి భక్తితో ఉండెను. ఆ మునీశ్వరుఁడు పోయినచోటికి తాను కూడ పోవుచుండెను. ఏ జంతువు అయినను దానిని తఱుముకొని వచ్చినపుడు అది ఆ ముని దగ్గఱకు పరుగెత్తుకొని వచ్చుచుండెను. ఆయన "తన కుక్కకు ఎప్పుడును జయము కలుగవలయును" అని ఆలోచించెను.

అప్పుడు ఆయన ఏమిచేసెనో ఊహింపఁగలరా! ఏజంతువుతో తన కుక్కకు పోరాటము కలుగుచున్నదో ఆ జంతువును జయించెడి మృగముగా దానిని చేయుచుండెను. అట్లు దానిని ఎన్నో మృగములుగ చేసెను. తుదకు ఆయన "ఇది పనికాదు" అనుకొనెను.

ఆ కుక్కను మృగములను అన్నిటిని జయించెడి శరభమృగముగా చేసెను. అట్లు చేయుటచేత అది మిక్కిలి [illegible]ను ? ఇట్లు అనుకొనెను.

సమిమను

"ఈ ముని నన్ను తన మహిమచేత అనేక జంతువులుగా మార్చుచున్నాఁడు. ఇప్పుడు నా యందు దయ కలిగి ఉన్నాఁడు. ఈ రూపముతో ఉన్న ఎడల నాకు అన్ని జంతువులున్ను భయపడుచుండును. నా యందు దయ తప్పినప్పుడు ఈ రూపమును మార్చివేయును; నేను ఈ మునిని చంపిన ఎడల ఇట్లే ఉందును"

ఆ సంగతి అంతయు ఆ మునీశ్వరుఁడు కనిపెట్టెను. ఆ కుక్కతో "ఓ కుక్కా! నీవు నీచమైన జంతువవు! నీ యందు ప్రేమ కలిగి ఉంటిని; నీకు ఉపకారము చేసితిని. నాకే కీడు చేయుటకు చూచుచున్నావు. అందుచే నీవు ఎప్పటివలె కుక్కవు అగుము" అనెను. అది కుక్క అయ్యెను.

—: ప్రకాశము :—

"మంచి చెడ్డలు ఆలోచించుకొనక నీచులను అధికులనుగా చేయరాదు. అట్లు చేసినవారలకే వారు కీడు చేయుటకు చూతురు"



—( ఇరువది రెండవ దీపము )—

# కార్తవీర్యార్జునుఁడు

పూర్వము మహిష్మతి అను పేరు గల ఒక పట్టనము ఉండెను. ఆ పట్టనమును కార్తవీర్యార్జునుఁడు అను రాజు ఏలుచుండెను. ఆ రాజు దత్తాత్రేయుని పూజించెను. ఆ దేవుని యొక్క మహిమచేత సకలవిద్యలను నేర్చికొనెను; గొప్ప బలముగలవాఁడును శౌర్యముగలవాఁడును అయ్యెను.

ఒకనాఁడు ఆ దత్తాత్రేయుఁడు శిష్యుఁడు అగు కార్తవీర్యార్జుని ఇంటికి వచ్చెను. ఆ కార్తవీర్యార్జునుఁడు మిక్కిలి భక్తితో గురువుయొక్క పాదములను రెండుచేతులతోను ఒత్తుచుండెను. అప్పుడు ఆయనకు నిద్ర పట్టినది. ఆ సమయము నందు ఏమిచిత్రము జరిగినదో ఎఱుఁగుదురా? ఆ గురువు యొక్క పాదములో ఉండి ఒకమంట వచ్చినది. ఆ మంటతోడ కార్తవీర్యార్జునుని చేతులు కాలినవి. అయినను గురుపాదములను ఒత్తుట మానలేదు. కొంతసేపటికి దత్తాత్రేయుఁడు మేల్కొనెను. శిష్యుని చేతులు కాలుట చూచెను. అతనిని మెచ్చుకొనెను. వాని వంటి బలముగలవాఁడు లోకములో లేకుండునట్లు వరము ఇచ్చెను. అందుచేత ఎన్నో సంవత్సరములు రాజ్యము చేసెను.

—:ప్రకాశము:—

"గురుభక్తి కలవారలకు సకలవిద్యలును సాధ్యములు ను. అది లేనివారలకు విద్యలు రావు"

